# ప్రశంసలు : పత్రికలు

1. గోల్కొండ పత్రిక

"......నాస్తిక్యం ప్రబలుతున్న వర్తమానయుగంలో కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులను బోధించే గద్య పద్య రచనలు ప్రచురించి సారస్వత సేవతోబాటు ఆస్తికధర్మప్రచారంచేసే సదుద్దేశంతో గోదా గ్రంథ మాల స్థాపించి శ్రీమన్నారాయణపుర దేవస్థాన ధర్మకర్తలు చేయుచున్న కృషి ప్రోత్సహింప దగినది......"

2. ఆంధ్రప్రభ

"......బాలవాఙ్మయం పేరున భక్తిని ప్రబోధించటానికి జరిగిన తొలి ప్రయత్నంగా గోదాగ్రంథమాలవారి మీరాబాయిని పేర్కొన వచ్చును......"

3. కృష్ణా పత్రిక

"......వైష్ణవ సాహిత్య ప్రచారానికి ఈ గ్రంథమాల నడుం కట్టుకోవడం మిక్కిలి ముదావహం......"

4. కల్యాణ్ (హింది)

"......హరిభక్తి ప్రచారమునకై మీరు స్థాపించిన గోదాగ్రంథ మాల దినదినాభివృద్ధి గాంచుచున్నందుకు మిక్కిలి సంతోషము......"

5. దివ్యజ్ఞాన దీపిక

"......గోదాగ్రంథమాలానిర్వాహకుల యుద్యమము అతి పవిత్రమైన దగుటయేగాక పితృవాక్య ధర్మపరిపాలన, భగవదారాధన, వీనిమూలముగా స్వపరశ్రేయస్సాధన, సారస్వతసేవ మొదలగు పెక్కు సత్ఫలముల కాలవాలమని ప్రస్ఫుట మగుచున్నది......"

6. భారతి

"......త్రివేణి యందలి శతకోశ చరిత్రలోని కవితాశైలి ధారాళం...... పరాంకుశ శతకంలో కొన్ని పద్యాలలో సహజమైన భక్తి భావమూ, సూక్తులూ, మధురోక్తులూ జాలువారుతున్నాయి..."

# భ్రమరగీతలు

అను

## ఉద్ధవసందేశము

సూరదాస భక్తాగ్రేసరుని "సూర సాగర్" మహాకావ్యము
నుండి సంగ్రహింపబడినది.




ఆంధ్రీకరణము :

'మధుర కవి' 'ఆంధ్ర తులసీదాసు'

### శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తి

శ్రీ గోదా గ్రంథమాల
తృతీయ పుష్పము
ప్రథమ ముద్రణము 1959
విలంబ - ఉత్తరాయనము
వేయి ప్రతులు:
స్వామ్యములు రచయితవి

భారత ముద్రణాలయము,
విజయవాడ - 2.

ప్రకాశకులు:—
శ్రీ గోదా గ్రంథమాల
శ్రీమన్నారాయణస్వామి దేవస్థాన ధర్మకర్తలు
శ్రీమన్నారాయణపురము
ఉల్లిపాలెం పోస్టు
దివి తాలూకా, కృష్ణా జిల్లా.



శ్రీమతి వీరత్తు జానకమ్మగారు, కోడూరు.

శ్రీమతి వీరత్తు జానకమ్మగారు భగవద్భాగవతాచార్య కైంకర్య పరాయణురాలు. ఈమె భక్తిపారవశ్యమును చూచినవారికి సాక్షాత్తుగ శబరియే జ్ఞప్తికి వచ్చుచుండును. శ్రీమన్నారాయణస్వామిపై మిగుల భక్తిశ్రద్ధలు గలవారు. వీరు భ్రమర గీతల ముద్రణకై 116-0-0 రూప్యములు విరాళముగ సమర్పించిరి. త్యాగముగల వీరి కుటుంబమునకు శ్రీ స్వామివారు ఆయురారోగ్యైశ్వర్యము లొసగి బ్రోచుగాత !

# మనవి

"సూర సూర తులసీ ససీ "అని హిందీలో నొకసామెత కలదు. హిందీ సాహిత్యాకాశమున సూరదాసు సూర్యుడు; తులసీదాసు చంద్రుడు అని దీని భావము. అట్టి సూరదాసుపై మా కాదినుండి భక్తిశ్రద్ధలు గలవు. సహజ పాండిత్యము గల పోతనామాత్యుని వలెనే యీ మహాకవిగూడ ప్రపంచ సుఖములను రోసి హరిభక్తి పరాయణు డగుటయే దీనికి కారణము. ఈతని "సూర సాగరము"న కృష్ణుని బాల్య క్రీడ లపారముగ వర్ణింపబడినవి. కృష్ణునిపై యశోదవలె వాత్సల్యభావము చూపినందున తాను తరించుటయేగాక భక్తలోకమునుగూడ తరింపజేయగల్గినవా డీ కవి. కావనే యీ మహాత్ముని భక్తి రసామృతము తెలుగువారికి రుచి చూపవలెనని మేము చిరకాలమునుండియు ముచ్చటపడు చుంటిమి. మా పూర్వపుణ్యము పరిపక్వమగుటచే కాబోలు శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తిగారి పరిచయ భాగ్యము మా కీ నడుమనే యబ్బినది. తత్ఫలితముగనే యీ కావ్యరత్నము బ్రచురించు నవకాశము మా కప్రయత్న ముగ సిద్ధించినది. తమ భ్రమరగీతలలోని కొంత భాగము నిట్లు సంగ్రహించి ప్రచురించుకొనుటకు నిర్వ్యాజానురాగ ముతో ననుమతించిన యీ "మధురకవి" కివియే మా అభివందనములు. వీరు సదా గోదాకటాక్షమునకు పాత్రు లగుదురుగాక.

ఇట్లే శ్రీ తులసీదాసు "వినయ పత్రిక" మీరాదేవి గీతములు మున్నగువానిని తెలుగున ముద్రించి ప్రచారము

లోనికి తేవలెనను మా వాంఛితాంకురమును పాఠకలోకము చిగురొత్తించిననాడు మేము ధన్యాత్ముల మగుదుము.

ఈ గ్రంథమాలను ప్రశంసించి మా యాత్మ విశ్వాసము నినుమడింపజేయుచున్న పత్రికలకును, ఉదారులకును మా కృతజ్ఞతలు. అర్థింపగనే స్వల్ప వ్యవధిలో దీనిని సమీక్షించిన యాప్తవరులు శ్రీ జోస్యుల సూర్యనారాయణ మూర్తిగారి కివియే మా నమోవాకములు. ఈ గ్రంథమాలకు వెన్నముకవలె సహకరించుచున్న శ్రీమాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులవారికి మా కేలో్మోడ్పులు.

ఈ గ్రంథమాల యిట్లు సారస్వతలోకమున నవతరించుటకు సర్వవిధములచేతను ప్రోత్సాహము కల్గించిన సహృదయవతంసులు ఘంటసాల గ్రామవాసుల కివియే మా నమస్సులు. కోరిన వెంటనే సూరదాసు చిత్రము పంపి ముద్రించుకొనుట కనుమతించిన గీతా ప్రెస్ (గోరఖ్‌పూర్) వారికి మా కృతజ్ఞతలు. ఈ గ్రంథమాలకు ప్రత్యక్షముగను, పరోక్షముగను సహకరించుచున్న కృష్ణాజిల్లాలోని ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు ఇవియే మా యభివందనములు.

హరిచరణ పరమాణువులు,

సంస్థాపకులు :

శ్రీ గోదా గ్రంథమాల.

# సూరదాసు



సూరదాసు ఆగ్రావద్ద రేణుకాక్షేత్రమున క్రీ. శ. 1457 లో జన్మించెను. ఈయన సారస్వత బ్రాహ్మణుడు. బాల్యమునుండియు కృష్ణభక్తుడు. గొప్ప సంగీతవిద్వాంసుడు. తంబురా చేతబట్టి తన్మయుడై తాను రచించిన కీర్తనలు పాడుచుండువాడు. ఆకాలపు వైష్ణవాచార్యుడగు వల్లభాచార్యులకు కొన్నికీర్తనలు వినిపింపగా నాయన సంతోషించి శ్రీమద్భాగవతమును హిందీలో వ్రాయుమని యాజ్ఞాపించెను. ఈ వల్లభాచార్యు డాంధ్రుడే యగుట మనము గర్వింపదగినది. తదాది వల్లభాచార్యుల శిష్యకోటిలో సూరదాసొకడుగనుండెను.

అష్టదిగ్గజకవులవలె ఆకాలమున "అష్టఛాప్" అను హిందీ భక్తకవుల సంఘ మొకటి యుండెడిది. ఆ కవులందరు కృష్ణగాథలు పద్యములలోను, కీర్తనలలోను గానము చేయువారు.

సూరదాసు గ్రుడ్డివాడు. కాని పుట్టుగ్రుడ్డివాడు కాడు. ఒకపరి యొక సుందరిపై తన దృష్టి ప్రసరించినందున నారసముతో కన్నులు పొడిచికొంటినని యాతడే తన గ్రంథమున నొకచోట చెప్పికొనెను.

ఈయన శ్రీమద్భాగవత మాధారముగ వ్రాసిన మహాకావ్యము "సూర సాగర్" భాషాంతరీకరణ విషయమున పోత



"నా చిన్నికృష్ణయ్యా! ననుగన్న కన్నయ్యా!!
ఏః చిన్ని తే జాత నేమి నోచితినయ్యా!!!"

నార్యుని విధాన మవలంబించెనని చెప్పవచ్చును. ఇందు సుమారు నాలుగు వేల పద్యములు కలవు. కాని దశమస్కంధ పూర్వభాగకథయే మిగుల పెంచి వ్రాసెను.

గ్రుడ్డివాడైనను, ఎక్కువ చదివినవాడు కాకపోయినను, భగవత్కటాక్షముచే తన ప్రగాఢహృదయానుభూతి నీతడు చక్కగ చిత్రింపగల్గెను. నవవిధభక్తులలోనూ వాత్సల్య, సఖ్యభావములకు ప్రాముఖ్యతనిచ్చెను. క్రీ. శ. 1542 లో నీయన పరమపదించెను.

---

# కవిపరిచయము

జననము 1922. నివాసము గోదావరీ ప్రాంతమున కొవ్వూరు తాలూకా కృష్ణంపాలెము. వీరు బాల్యమునుండియే మధుర కవితను వ్రాయ నలవరచికొనిరి. స్నిగ్ధ హృదయులు. ఆంధ్రీకృత తులసీ రామాయణము లన్నిటియందును వీరిదే మిన్నయని పండితుల యభిప్రాయము. వీరి జానకీజాని శతకము భక్తిరసభరితమై ఏకాక్షర ప్రాసముతో నెంతో ముద్దులు మూటగట్టుచుండును. హాలముతో జీవయాత్ర సాగించుచు, భవసాగరమునుండి జనులను తరింపజేయుటకై కలమునుం జేతంబట్టిన మధురకవి వీరు.

వీరి గ్రంథములు : (ముద్రితములు)

1. తులసీ రామాయణము - బాలకాండ
2. ,, ,, ఉత్తరకాండ
3. జానకీజాని శతకము

(అముద్రితములు)

1. తులసీ రామాయణము - మిగిలిన కాండలు
2. రామలింగేశ్వర శతకము
3. నేల తల్లి

శ్రీరామాయ నమః

# సమీక్ష

ఆంధ్ర సారస్వత లోకమునకు బమ్మెర పోతన వాగ్ధారామాధుర్యముతో భ్రమర గీతలు సుపరిచితములే. భక్తకవులలో నగ్రతాంబూల మందిన పోతన యాంధ్రలోకమున కెట్లో ఉత్తర భారత సాహితీలోకమునకు తులసీదాసు, సూరదాసు, కబీరు అట్టివా రన్నది విజ్ఞుల కపరిచిత విషయము కాదు. భక్త సూరదాస మహాకవి వాణి తెలుఁగు లోకమున కందించు ప్రయత్న మీ ప్రస్తుత భ్రమర గీతలలో ప్రధానోద్దేశమని నా యూహ.

శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తి ఆంధ్రలోకమున నూతన పోతన యనదగిన కవి యని నే నీ కవి యనువదించిన తులసీ రామాయణమును జూచి భావించితిని. ఈ నా యూహ సరియైనదే యని యాంధ్ర సహృదయలోకము సాక్ష్యమిచ్చినది.

ఇట్టి యీ నూతన పోతన భ్రమర గీతలు తెలుఁగు పాఠకుల కరకమలముల కందించు యత్నము గడు ప్రశంసనీయమనుట స్వభావోక్తి మాత్రమే. అందుచే ముందుగ నీ గ్రంథప్రకాశకుల నభినందింపవలసిన ధర్మమును నిర్వర్తించి తర్వాత నిందలి కవితా మాధురి నాస్వాదింప యత్నింతును.

ప్రాచీన హిందీసాహితిలోని యీ కావ్యవస్తువు ననువదించుటలో నీ కవి యెన్నుకొన్న రచనారీతి గమనింపఁగా నిందు రచయితృస్వతంత్ర భావావేశము, మాతృక నవగతము చేసికొనుటలోని పాండితి, మూలకర్త యందలి భక్తి తాత్పర్యములు వ్యక్తము లగుచున్నవి. "రగడ!" లనువైన చోట రచియింపవలెనన్న తలంపే యసలు మధురోహ. పరదేశమునకుఁ జెందిన భాషలోని వస్తువు నాంధ్రమునకు దెచ్చుటలో నా భావసంపద కనువైన తెలుఁగుదనము నిచ్చుటకంటె నిర్మాణశిల్పములోని సౌందర్యకల్పనము వేఱొండుండదు. అట్లని యన్యప్రాంతీయ కన్య కస్మత్ప్రాంతీయ వేషభాషాసమలంకరణము మాత్రమే పర్యవసానము గాకుండ నీ ప్రయత్నము నూతనమై రమ్య నవ్య కావ్యసృజనమగుట యిందు ముఖ్యము.

ఇది యనువాదమున కుండఁదగిన యుత్తమ గుణమని నా భావన. అది యీ కవి కున్నదనుట కీతని కృతులే సాక్ష్యము.

భాగవత కథావస్తువు "సూర సాగర్" చదువునప్పటి యనుభూతికిని అయోధ్యాసింహ ఉపాధ్యాయుని "ప్రియప్రవాస్" చదువునప్పటి యనుభూతికిని భేదము గన్పట్టుననుట యెట్లు నిర్వివాదమైనదో, రెండును రెండు మధురవాహిను లనుటయు నట్లే నిర్వివాదవిషయము. ఈ యాంధ్ర భ్రమర గీతలును పై వితలమధ్య ప్రవహించు మరియొక నూతన మధుర కవితా ధునియై ప్రవహించుచున్న దందు కీ కవి వందనీయుఁడనుచున్నాను.

"ప్రేమ ప్రేమతే హోఇ, ప్రేమతే పారహి ఏ ఇయే,
ప్రేమ బంధ్యో సంసార్, ప్రేమ పరమార్థ్ అహియే,
ఏకై నిశ్చయ ప్రేమకో జీవన్ ముక్తి రసాల్
సాంచో నిశ్చయ ప్రేమకో జేహిరే మిళై గోపాల్"

అన్న సూరదాసనూక్తి కీ యనువాదము పరికింపుఁడు :

"ప్రేమమె ప్రేమమూలమగు, విశ్వమి దెల్లను ప్రేమబద్ధమౌ
ప్రేమమె మోక్షసాధనము ప్రేమమె జీవన ముక్తిహేతువౌ
ప్రేమమె సార్థకత్వ మొదవించును ప్రేమమె తారకంబు మా
ప్రేమమె నిక్కమౌనెడ లభించును నందసుతుం డవశ్యమౌ"
(96. ప.)

ఈ ప్రేమతత్వసారమే కవి గోపికలద్వారా ఉద్ధవునకుఁ జెప్పించెను. ఇదియే యిందలి కథాగతమైన ఆత్మ. సగుణ నిర్గుణోపాసనల తారతమ్యమును సామాన్యమానవుని యూహ కందుభావనతో నీ కావ్యమున వ్యక్తము చేయుట ప్రశంసాపాత్రమైనది. "మా తలల నంటగట్టనీ ప్రేత అమున" (82. ప.) అను పద్యము చూడుఁడు; గోపికల భక్తియొక్క పరమ తత్వ మేదో యీ కావ్యము చదువుటవల్లఁ దెలియగలదు. ఈ ప్రధాన విషయమున కొనర్చిన 'యనువాద మాధురిని ఆంధ్రీకర్తృహృదయమును గూడ దెల్పఁ గల్గుచున్నదనుట కిది యుదాహరణము.

గోపికల కృష్ణపరతంత్రతలోని గాఢతను వ్యక్తముచేయ "నిండుప్ నూతులు" (85 ప.) "అంపడు తన సందేశము" (86 ప.) "ఇంట నిరా

నిందుకొ నెన్" (87 ప.) ఇత్యాది పద్యములు పఠించి పాఠకుఁడు తల యూపఁగలఁడు.

ఇఁక శ్రీ మైలవరపువారి రచనామాధురిని మరల నేను లోకమున కెఱిఁగింపఁ బూనుట చర్విత చర్వణమే యని తోఁచినను నాహృదయమందిన యానందమును వ్యక్త మొనర్చకుండుట యెట్లు? అందుకని –

"నందనందనుఁడంపినాఁడో యనుకొందు
నెందుండి యేతెంతు వే తుమ్మెదా! యిందు
నల్ల కృష్ణునిబోలె నగవుచు నుంటివు
నల్లనయి పచ్చనౌ నడికట్టుఁబడి లేవ
మున్నె మాసర్వస్వమును వెంటఁ గొనిచనెను
వెన్నుఁడింకేది లే ప్రేపల్లె కంపె నిను
మాయన్న మనసౌకటి మధుర తోఁటానిపోయి
చీకు చింతలు లేక చెలఁగుచుండెను హాయి" (92 ప.)

ఈ రచనలోనుండి పోతన తొంగిచూచుట లేదా!

"రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహోరస్కుండు పీతాంబరుం
డాజానుస్థిత దీర్ఘబాహుఁడు..............
............ ఒక్కఁ డీరుఁ డిచటన్ రాజిల్లుచున్నాఁడు మా
రాజీవాక్షుని భంగి"

నన్న పోతనగారి గోపికల వలెనే వీరును మొదట నుద్ధవునిఁ జూచి యనుకొనుటయే గాక మరల నైరితిగఁ గూడ ననుకొనుచున్నారు.

మొదట వీరనుకొన్న రీతి యిది—

"అల్లదే నల్లవాఁ డరుదెంచు నెవఁడో మన
నల్లనయ్యను బోలె నలువారు రూపమునఁ
బాడ కట్టు నడికట్టు పుట్టంబు నట్టిదే
యొడలి తొడవులం నట్టి వాఁడు నెల్ల నట్టిదే." (29. ప.)

ఈ యుదాహరణములే గాక పోతనఛాయ లిందు చూచినచోట నెల్ల గన్పట్టుచుండ నే నవి యెత్తి యిచ్చుట నా వెఱ్ఱి యుత్సాహము నిచ్చుటయే యౌనని పాఠకుల గ్రంథపఠనపరత కడ్డురాకుందును.

కథావస్తువునఁ బోతనగారికి వీరికి భేదము లిజ్ఞాల కెలుకవడుచున్నదే కాన నదియు వివరించి చె నద్దురాను. కాని యీ మధురరచనాస్వాదన మొనర్చుఁడనిమాత్ర మనుచున్నాను.

"గోకులావాసులము గోపాల దాసులము
మా కులము గోకులము మన్నించు వ్రజకులము
ఆ యశోదాసుతోపాసనా లోలులము
తీయమున వారి సజాతీయులము సకీయులము
గోబృంద సహచారి గోవర్ధనోద్ధారి
మా బాలకృష్ణుఁడే మా మానస విహారి
కృష్ణ సహవాసినుల మే మెల్లవారలము
కృష్ణుఁడే యొడ్డడని యొద నమ్మువారలము" (69 ప.)

ఇట్టి రచన లీ కవి పరవశుఁడై తన్మయతతో నొనరించెనని వేఱుగ చెప్పనక్కఱలేదు.

కవిధన్యుఁడు; పరమ భాగవతుఁడు. ఈ కాలమున నిట్టి భాగవత రచనమును బ్రకాశింపఁ జేయు శ్రీ నరసింహాచార్యులుగారు ధన్యాత్ములు. వీరిద్దఱి సౌజన్యమును నా కలము నిట్లు ధన్య మొనర్చినందులకు వీరికి నా ధన్యవాదములు.


నూజివీడు
విలంబి-నాగులచవితి

జోస్యుల సూర్యనారాయణమూర్తి,
సాహిత్య శిరోమణి, విద్వాన్, విశారద.




# భ్రమరగీతలు

## శ్రీకృష్ణుఁడు గోపికా స్నేహబద్ధమైన తన మనస్థితి నుద్ధవున కెఱిఁగించుట

ద్విరదగతి :

ఉద్ధవా ! యాసు బోకుండె నా కిం దుండ
బద్ధమై మనసు వ్రజవాసులను విడకుండ
మందబాలురఁ గూడి మందిగా వని నాల
మందలనుమేపి సమ్మదమందు నా లీల
కన్నగాండ్రను బోలె గడప కన్నమువేసి
వెన్న పాల్ మ్రుచ్చిల్లి వేడ్కఁ జుత్తెడు వాసి
ఆటలను మరగు నా యాకొన్న కన్నెంచు
పూఁట పూఁటకుఁ బిల్చి బువ్వ ననుఁ దినిపించు
ఆయశోదమ్మ నెయ్యమ్ము, వనమున మంద
గాయఁ జనునాటి సంగాతము లెపు డెడంద
మఱపు రాకుండె నా మందబాలుర తీరు
మురిసి నను మురిపించు మోహనాంగుల సౌరు
గోపమ్మ తినిపించు గోరుముద్దల పసలు
గోపికల గుసగుసలు, క్రొత్తతరి మిసమిసలు
ఇం దేవి చెప్పుమా ! యీ పాళమున నన్న
మందలో వ్రాలఁగా మనసాయె నా కన్న
అనఘుఁ డుద్ధవుఁ డంత హరిని ప్రేమోన్మాది
యనుకొనుచు జ్ఞాన దురహంకార మెద నూది

అమల నిర్గుణయోగ యమ నియమ సంపత్తి
యమరు నధికమ్ముగా నలఁతి బత్తి ప్రపత్తి

అని హరి ప్రేమ లౌల్యముగఁ జిఱునగవునను
జినచూపునను జూడ శ్రీకృష్ణుఁ డనుకొనెను

అనుకొనిన యట్ల జ్ఞానాభిమానము హత్తి
నది యనఘుడౌ నితని కాత్మలో మొలకెత్తి

అని మాట మఱుఁగిడుచు నఖిలాత్ముఁడు వచించు
ననిశ మా ప్రేమవృత్తాంతంబును దలంచు

వ్రేతలంపుదలంపు విడకున్నదోయి! నను
రాతిరియు బవలు నిద్రా విహారాదులను

మందకుఁ బరువెత్తు మనసు నిల్కడ కోడు
నందాంగణమున నానందతాండవ మాడు

నందయ్యయు యశోద నా బహిఃప్రాణములు
మందయానలు గల్గు మంద నా ప్రాణములు

చెరలాడు ననఘ! నా చిత్త మెడబాయ దొక
పరమాంతరంగికము వచన మది వినవె యిఁక

నా కన్నులకు మిన్న నగరు కన్నెలమిన్న
నా కన్న కల పంట నా కోర్కె లిడు దంట

నమ్మ మన్నలమిన్న నా బహిః ప్రాణమ్మ
సుమ్మ! నాసొమ్ముగాఁ జూచు సర్వస్వమ్మ

రాధికను విడదీయరా దిఁకను నాతలఁపు
రాధికాప్రేమ మారాధించుఁ గొని వలపు

ఎందుండె నిట నా బహిఃప్రాణ మా రాధ
　　యిం దేరి కని వినుతు నే మా ప్రణయగాథ
ఆ పూవుబొదరిండ్ల నా పూవుబోఁడి మన
　　సాపోవఁ గూడి సల్లాప మాడెడు నదన
తలపోసి పోసి పరితాప మందెద నిందు
　　లలన లా రాసలీలల కుబ్జవారెందు
విధివ్రాత వితథమై విత కాదుగా యంచు
　　వ్యథఁగూరు హరిలౌల్య మారసి దరహాసించు
కంసారి కా ప్రేమకాతర్యము విదల్ప
　　సాంసారికప్రేమ సారహీనతఁ దెల్ప
ఉద్ధవుం డనె నేటి కుద్ధురంబగు ప్రేమ
　　బద్ధుఁ డయ్యేవయ్య ప్రాపంచికప్రేమ
బ్రహ్మతత్త్వం బొకఁడె పరమసత్య మసత్తు
　　బ్రహ్మేతరం బయిన ప్రాపంచికపు సొత్తు
సంసారమె యసత్తు సారహీన మటన్న
　　సాంసారికప్రేమ శాశ్వతమెటౌనన్న !
మిథ్యాప్రపంచపు మిడిమేల మడియాస
　　సాధ్య మొనరించుకొనఁ జను బ్రహ్మజిజ్ఞాస
అని బ్రహ్మతత్త్వ బోధాతురుండవు నుద్ధ
　　వుని బోధ విని వృష్ణిపుంగవుఁ డతిశ్రద్ధ
పెద్దసేసెడు బ్రహ్మవేత్త వీ వుద్ధవా !
　　సద్దుసేయుట కీవు సామాన్యబుద్ధివా ?

గొల్లతలు నా ప్రేమఁ గొల్లగొను తలపునన్
దల్లడిల్లుచు నుందు రుల్లముల దలచినన్
విరహాకులం బయిన వ్రేతల యెడంద నను
మఱచునటు యోగమహిమను నుపదేశింపఁ జను
శాశ్వతానశ్వర జ్ఞానపథ మలవఱిచి
నశ్వర ప్రేమబంధమునుండి విడవఱిచి
ఉద్ధరింపుము వారి నుద్ధవా! యేవడువు
బుద్ధిఁ గఱపెద నీకుఁ బూర్ణత త్త్వజ్ఞుఁడవు
గోకులాంగనలు మది కుం దణఁచి రమ్మనుఁడు
మైకొనెనుహరి యోగమార్గమునుగొనె యతఁడు. 1

శ్రీకృష్ణుఁ డుద్ధవుని వ్రేతలకడకుఁ బంపించుట

సీ॥ మందపెద్ద యయిన మా నందపెద్దయన్
ముందు సందర్శించి మ్రొక్కుమయ్య!
మా సేమ మెఱిఁగించి మా రాధ కన్న వా
రల యింటికేగి భద్రంబు లడుగు
కూర్మి సుదామ ముఖ్యుల సంగడీంద్రను
నామాటుగాఁ గూడి సేమమరయు
మల మందముద్దరాం డ్రలర నా కుశలంబుఁ
దెలిపి తచ్చింతలఁ దీర్పవయ్య!
తే॥ మంద నందాలరాశి మా మంతిరి యొకఁ
డుండె నెలప్రాయమునఁ బట్టు కండువాను
గట్టి పించెంబుగట్టి చేపట్టి మురళి
నఱుత వనమాలఁబూని నట్టాడుచుండు. 2

తే॥ అట్టి మా మంత్రి దర్శించి సావధాన
మతిని నామాటు నతుల నున్నతి యొనర్చి
అంద జేయుము నాయభినందనమును
మధురవార్తా ప్రసక్తి నెమ్మనము లలర. 3

క॥ బృందావని గో గోపక
బృందావని యాచు నొక్క వేలుపు ప్రోచున్
డెందాన భీతిఁ జెందకు
మందకుఁ జను వేళ విపినమార్గంబులంగో. 4

ఉ॥ పెంచితి పెద్దచేసితివి, వృష్ణికులీనుల మంచు నేఁడు మ
మ్మెంచి యొకళ్లసంతు మనకేలని మెల్లన సాగనంపి నొ
ప్పించితి మా మదుల్ కుదువఁబెట్టినసొమ్ములనొప్పగించి యే
కొంచెము లేక చేదులుపుకొన్నటు మమ్ముఁ
దలంపవైతిఁకన్. 5

ఉ॥ పిన్నటనాఁడుగాఁ బసులవెంబడిఁ గ్రోసులదూరమేగు మా
వెన్నడివచ్చితీ వురుకువెట్టుచు నట్టిడ వీవు మమ్ములన్
గన్నడసేసి వేఱ్పరతు కట్టడ, దేవకి కన్న కాన్పుగా
నన్నిఁక నందురాణి యొడినర్మిలికన్ విధి దవ్వొనర్చెగా. 6

ఉ॥ ఈపురి రాచకార్యముల నేపని మాకు సుఖంబు లెల్ల ము
న్నే పడిగాపులై కొలిచెనేనియు, నుద్ధవ! నాతలంపుతో
నోపికలోడు గోపికల కూటుటఁ గొల్పఁగదయ్య మాకు మే
మై పదినాళ్లలోన నరుదారఁగ నం దరుదెంతుమం చెటో.

ఉ॥ ఉద్ధవ! యొడ్డుగానని వియోగధునిన్ మునుఁగాడ జ్ఞానసం
బుద్ధ మొసర్చి గోపికల బుద్ధుల నఱ్ఱ మఱపింప వాఙ్మన
శ్శుద్ధిని నిన్నుఁ బుత్తు నల చోటికి నిర్గుణ రూప జాతి సం
బద్ధ మనశ్వరంబు నిరుపాధికమౌ నల బ్రహ్మతత్త్వమున్. 8

ఉ॥ శ్రద్ధగ వారికిన్ వినిచి జ్ఞానమె ముక్తి నిదానమంచుఁ ద
ద్బుద్ధుల జ్ఞానయోగపరముల్ బొనరింపుము
శ్వాసవాయు సం
వృద్ధవియోగదావశిఖి వేగు వ్రజాంగన దేహతూలముం
దుద్ధుర బాష్పవారి మనియుండెడుఁ జేతనతోడ నింతకున్.

క॥ ఇంతకు స్మృతితప్పక వల
వంతలఁ గొనయూర్పులూని బ్రతికెదు వ్రజ సీ
మంతినుల చింత లణఁపుము
సంతసపడ వినిచి నాదు సందేశంబున్. 10

క॥ ఉచితజ్ఞుఁడ వీ వేమని
వచింతు నసహాయమైన వారి యవస్థన్
సుచరిత యూఱడఁబెట్టక
పచరింత్రేటు దిటవుతోడఁ బలుకఁగదన్నా. 11

ఉ॥ ఏ మిదెయన్నదమ్ములమటే చనుదెంచుచునుంటిమంచు మా
కై మది నాత్ర మందవలదంచును మందకునేగి మా యశో
దామహిళామతల్లికిని, దాదిగఁ ద న్ననుకొన్న దాదిగా
మా మనసెంతొనొచ్చెనని మా నుడిగా వినిపింపుముద్ధవా.

సీ॥ పేరిమిఁ బాలిచ్చి పెంచి పెద్దయొనర్చు
మే లెన్నఁ డేమరఁజాల నసుము
తన్ను మా దాదిగాఁ జిన్నబుచ్చుకొనంగ
మా యెదలే బ్రయ్యలాయె నసుము
తన్ను వీడినదాది "కన్నయ్య" యని నన్ను
బేరుకొనినవారె లేరు యనుము
మధురఁ గుడువఁ గట్ట మహితసంపద లున్న
మది మందచెల్మికే మరగె నసుము

ఆ॥ పొద్దుఁగు పాలులేవు ప్రొద్దుటం జద్ది లే
దల్ల మంద విడిన దాది మాకు
మధుర నెన్నియున్న మధురమృష్టాన్నముల్
మనసురాదు మిమ్ము మఱఁగియుండ. 13

తే॥ కొటికదాఁటించి మరల నీ కొడుకు సుద్దిఁ
దలఁపఁబోవైతి! కటికి డెందంబుతోడ!
అక్కటికఁ దక్కె నందయ్య! యక్కటకట!
యొరుల తాకట్టుసొమ్ముఁ దా మొప్పగించి. 14

తే॥ యొప్పరిక మూనినట్లు మ మ్మొప్పగించి
తని మగుడఁ బల్కె నా ప్రాణధనములైన
యల్ల పుల్లావు వెల్లావు లవ్వి నాదు
బెంగతోఁ జిక్కకుండ మేపింపు మనుము. 15

ఉ॥ అల్లరిపిల్ల రాధ యదుగద్దనకుం జనుదెంచుచుండి నా
పిల్లనగ్రోవి ముచ్చిలెనొ, వేగనులం గను పెట్టిచూడుఁ డా

పిల్లకు నందకుండ నవిపెట్టెను డాఁచుఁడటంచుఁ బల్కె నా
తల్లికి, నందబాబయుపదంబుల నొదల వ్రాల్చి మ్రొక్కుమా!

క॥ ఇవె మందవాడజాడల
వివరించితి వ్రేతలను వివేకవతులుగా
సవరించి యెట్లువత్తువొ
వివేకనిధి! యనుచు శౌరి వీడ్కొనె సఖునిన్. 17

ఉ॥ చేకొని జ్ఞానయోగమును శ్రీహరియే శిరసావహించి నన్
గోకుల మంపుచుండె నిటు గొల్లపడంతుల జ్ఞానయోగ వి
ద్యాకుశలాత్మలన్ సలుపనంచుఁ గనుల్దల కెక్కె నుద్ధవుం
డేకట జ్ఞానగర్వమున నెంచుచునుండె హరిప్రశంసలన్. 18

క॥ "తన్నఁట గోపాలుం డఁట
యన్నుల మిన్నలకు యోగ మలవఱిచి మదిం
దన్ను మఱపించి యెఱుకువ
తెన్నుఁ గఱపఁ బంపునంట దృఢమతి యనుచున్. 19

క॥ తన్నొక యుపదేశకునిగ
నున్నతి యొనరించి పంపె యువతులకడ కే
నన్నము పున్నము నెఱుఁగక
మన్నన శిరసావహింతు మాధవు నాజ్ఞన్. 20

ఉద్ధవునిచే కుబ్జ వ్రేతలకు సందేశమంపుట

క॥ యాదవపతి యానతిఁ దమి
నొదల నిడి యుద్ధవుం డటే తెంచెడిచో
నాదటఁ గుబ్జ యనె యశో
దాదుల కే నూఁదిపల్కెనటు లనుమనుచున్. 21

తే॥ వెన్నముద్దల నొరఁజూపి పిన్నవానిఁ
జేసి కృష్ణుని మదవతుల్ చెంగున ముడి
వైచి మరపుకొనిరి తమవంక కిపుడు
పిన్నవాఁ డల్ల పెద్దయై యన్ని తెలిసి. 22

తే॥ చిన్నవోవుచు మీచేయు చేతలకును
మంద నడుగిడఁ దలఁపఁడు మగుడ నతఁడు
తరిచి మీచెయ్వు లొకసారి తలఁచు కొనుఁడు
పరితపించిన ఫలమేమి పదను దప్పి. 23

ఉ॥ కట్టడు లెన్ని పెట్టినది కన్నని యించుక వెన్నకోసమై
కట్టి యశోద, రోటి పెనుకంబమునన్ దయమాలి మీరు నా
కట్టిడి కెంతొ సాయపడి కట్టెడి త్రాళ్లిదురిచ్చిరంచు నే
పట్టున నాలపట్టు నెడపట్టు తలంపిడె మాధవుం డిఁకన్.

తే॥ కన్న డిపు డింక మీ చెలికాఁడు కాఁడు
కన్నవారునుగారుసూ! కన్ననికిని,
గోపదంపతు, లీజాడ గురుతెఱఁగి,
కన్నవారల గుఱుతించి, కన్నుఁ దెఱచి,
మధుర కేతెంచినాఁ డన మాధవుఁడును. 25

క॥ ఒకయెడ ప్రేమాస్పదయా
సకురా లా కుబ్జ చూపు సఖ్యగరిమ వే
ఱొకయెడ ప్రేతల చెలిమిని
నొకఁడోఁ గాదనఁగ నేర కూరకయుండెన్. 25

వ్రేతలు వ్రేపల్లెకు వచ్చు నుద్ధవుని గాంచి కృష్ణుఁడని భ్రమించుట

ఉ॥ అవ్వగలాండు కృష్ణవిరహవ్యథ నెద్దడి మీాల యట్టులై
దవ్వులనుండి యొక్కయరదంబరుదెంచుచునుంటఁగాంచి వాఁ
డెవ్వఁడొ గోకులమ్ము దెసకే మధురాపురినుండి వచ్చులా
గెవ్విధిఁ దోఁచె సారథికి నీ పురిఁ జూపి వచించు నేదియో.

ఉ॥ కంటిమియీతనిన్ నలుయుగంబులనాఁ డనునానవాలు వా
కొంటకు రాదుగాని తలకూడెను పోలికి వాలకమ్ము ల
న్నింటను శౌరి నంటుకొనె నెత్తలఁ గ్రాలు కిరీట మట్టిదే
యొంటి నిగార మట్టిదియు, యుజ్జ్వలకుండలకాంతు లట్టివే.

ద్విరదగతి రగడ :—

అల్లదే నల్లవాఁ డరుదెంచు నెవఁడొ మన
నల్లనయ్యను బోలె నలువారు రూపమునఁ
పొడకట్టు నడికట్టు పుట్టంబు నట్టిదే
యొడలి తొడవులు నట్టి వొడుపెల్ల నట్టిదే·
అరదమునఁ గూర్చుండు హరువట్టి దట్టిదే
యఱుతఁ బూనిన మాల యానవా లట్టిదే
అచ్చుకట్టిన దిట్టు లతని రూపనవేల
అచ్చముగ నాహరియె యరుదెంచె నీవేళ
అని గోకులప్రజలు శ్యామదర్శనకాంక్షఁ
గనులు గాయలుగాయఁ గాచుకొని రాకాంక్ష
తనులు పులకింప గాత్రములు డగ్గుత్తికను
బెనఁగ నమితోత్సాహవీచు లెద లత్తుకొను

చెందున్న చెలు లంద యింటిపనులెల్ల విడి
మందలై పఱతెంచి మందవీధిని నెగడి
సందడించి రథంబు సన్నిధికి రానేచి
యందు నిందీవరసమాభు నుద్ధవుఁ జూచి
తెల్లవోవుచు గొల్లచెలువ లి ట్లనుకొంద్రు
చెల్లి! నగరాంగనల స్నేహపాశగురలందు
అల్లుకొని సతము కుబ్జాబ్జాస్య మరగునా
వల్లభుం డీ గొల్లపల్లె కిటు తిరుగునా?
అని సూరదాసవరదాగమము శంకించి
వనరిరి నిరాశలై వనిత లుద్ధవుఁ గాంచి. 29

ద్విరదగతి:—

మందదొర నందయ్య మందిరపు మొగసాల
యం దాగు నా రథం బరసి చెలు లీలీల
ననుకొనిరి కొంద ఱాయనఘుఁ డక్రూరుఁడే
చనుదెంచెనో మగుడ సందియము యాతఁడే
మున్నె మన సర్వస్వమును ప్రాణ ధనముఁగొని
చన్నవాఁ డేటికే చనుదెంచె మగుడ నని
మనయం దనుగ్రహింపఁగనె వేంచేసెనా
యనఘుఁ డనిపించె నని యతివ లొక ర్తనఁగనే
హరిసఖుం డుద్ధవుం డా చెలుల కాలోన
దరిసెనం బిడె గలుగ ధైర్యమ్ము మదిలోన
మన నందనందనుని మాన్యసఖుఁడని యెంచి
వినుతించి రతని నా వ్రేత లభినందించి

పండబారెను మా భవములు నినుఁ గన్నంత
　　పండి కల నిక్కలగఁ బాయు నెపుడు కలంత
నినుఁగూర్చి విన్నయది నిండు నిజ మనిపించె
　　నినుఁ గన్నయది మొదలు నిజము రుజువై మించె
నిండు కనికరమునకా నిండు మెత్తని మదిఁ గ
　　లండ వమలుండ వకలంకుడవు నిక్కముగ
మంచి మానిసివంచు మంచి మాటల నెంచి
　　మంచినీటను మీలమచ్చునం దులకించి
నెగడి రుద్ధవుని సాన్నిధ్యము నధిగమించి
　　మగువలు హరిసమాగమన కాంక్షల మించి. 30

# భ్రమరగీతలు

## భ్రమరగీతల సంగ్రహ చరిత్రము

సీ॥ గోపికయొక్కతె మున్ను గోపాలుఁ డేగిన
దెసనుండి మురళి నాదించినట్లు
వినవచ్చిన ప్రియుండు వేంచేసెనో యని
పరవ నాయమ వెంటఁ బడి పడంతు
లుద్ధవుం జేతెంచ శ్రద్ధతో నందు స
న్నిధికిఁ దెచ్చి యెడంద నిండి పొరలు
హర్షవీచుల నోలలాడి రా నందుఁడుఁ
హరిసఖు నంత నత్యంతభక్తి

తే॥ నాసనార్ఘ్యపాద్యాచమనాదివిధులఁ
గొలిచి మెయిఁ జందన మలంది తిలకము నిడి
అంఘ్రు లర్చించి దూర్వాంకురాక్షతలను
వలఁగొని శుభాంబుపూర్ణకుంభములతోడ. 31

క॥ హరి యాదవపతి యంపిన
యరిమిలి చెలిమరికి నర్హమౌ మర్యాదల్
మరియాద దప్ప కన్నియు
జరిపించెను నందవిభుడు సమ్మతి నటుపై. 32

క॥ "హరి యాదర మేదురముగ
మరియాద లొనర్చి పంపె మక్కువ చెలిచేఁ

గర మరుదగు నుపదేశము
వెరవే పెడచెవినిఁ బెట్ట విందము రారే" 33

తే॥ అనుచు నా నందు వాకిలి నావరించి
హరి శుభోదంతసంశ్రవణానురక్తి
నుద్ధవునిచుట్టు గూర్చుండి యుత్సుకమునఁ
గుశలవార్తల నడిగి రా గోపసతులు. 34

సీ॥ దేవకీ వసుదేవ దివ్యదంపతులకు
భావుకంబె సుకంబె పార్థివునకు
వెన్న నేనాఁడో మా వ్రేపల్లె నెడఁబాపి
కొనిచన్న యక్రూరుఁడును గుశలుఁడె
హరి కృపాపాత్రయై వరరూప సౌష్ఠవం
బందిన కుబ్జ యానందయుతయె?
భద్రంబె శ్రీ బలభద్రమూర్తికిఁ దక్క-
చెలులు చుట్టాలకు క్షేమమా నె?

తే॥ శుభయుతుండౌనె మా శ్యామసుందరుండు
భద్రయుతుఁడౌనె మా బలభద్రయుతుఁడు
మోదయుతుఁడౌనె మా మానోమోహనుండు
స్వస్తియుతుఁడౌనె సూరదాసస్తుతుండు. 35

మ॥ అని కృష్ణప్రియు లంతకంతఁ బ్రియవార్తాకర్ణనోత్కంఠ నె
మ్మనముల్ దొందరవెట్ట నుద్ధవుని వేమారడ్గుచున్ దత్పదా
బ్జనతోత్తంసినులై యొడల్ మఱచి కృష్ణప్రేమ సాకారమై
చనినట్లుల్ పొడకట్టి చిత్రగతిఁ జేష్టల్ దక్కి కన్పట్టినన్.

క॥ అల్ల హరి ప్రేమ మొదల
నల్లుకొనిన గొల్లచెలుల కబ్బిన భాగ్యం
బుల్లమున మెచ్చు చా యదు
వల్లభసఖుఁ డుద్ధవుండు భావించు నెడన్. 37

క॥ ఎల్లగతులు తా నని యొకఁ
డొల్లక తను నమ్ముకొనిన యువిదలకడకున్
జెల్లు నె యోగాభ్యాసము
వల్లింపింపంగ నన్నుఁ బంపఁగ హరికిన్. 38

తే॥ నమ్మిఁ ద న్నడుగడలుగ నమ్ముకొనుచు
గొల్లపల్లెను దనకూర్మిఁ గొల్లగొన్న
గొల్లకన్నెల వలఁపు తా నొల్లకున్న
జెల్లునొకో యల్ల వల్లవీవల్లభునకు. 39

తే॥ ప్రేమమూర్తుల వ్రేతల ప్రేముడిముడి
త్రెంచి తెగఁదెంచుకొన నుపదేశ మొసఁగి
జోగఁపుందారిఁ బట్టించు *జోగుపనికి
నేల ననుఁ బంపె నయ్యయో! వేలఁ జేసి. 40

క॥ తను మఱచి తన్ను మఱపిం
పను వ్రేతల కెఱుకఁ గఱపఁ బాడియె హరికిన్
దనలేఖ జదువఁ బ్రేముడి
కనునీ రడ్డినది ప్రేమకాతరల కనన్. 41

* జోగిపనికి

మ॥ అనిలోలోఁదలపోసి యాసతుల ప్రేమాత్మైక్యముంగాంచివి
రనుసంధించిన సఖ్యభావమున లక్షాంశంబె నాజ్ఞాన మం
చని సిగ్గిల్లి యెడందఁ గ్రందుకొను జ్ఞానాహంకృతిన్ డించిక
న్గొనలం గూరు ముదశ్రు లొత్తుకొనుచున్ గొండాడుఁ
దద్భాగ్యముల్. 42

ఉ॥ ఆవిధి ప్రేమమూర్తుల వ్రజాంగనలం గని, ప్రేమతత్వసం
భావనఁ జేసి యుద్ధవుఁడు పైపయి
యాసులఁ గొంత సేపదో
పోవడఁ బుచ్చి తన్ను హరిబోధ
మొనర్పఁగ బంచు తత్వమం
దా విరిబోండ్ల కెల్లను వెలార్పఁ
దొడంగెను దేశికుంబలెన్. 43

ఉ॥ కామినులార! మోహ మమకారములం
ద్యజియించి భూరి మా
యామయ సంసృతివ్యథ బయల్పడి
పాయుఁడు ప్రేమబంధముల్
నేమముతోడ యోగసరణిం
జను సాధన మభ్యసించి జ్ఞా
నామలవృత్తి శాశ్వతు ననంతు ననశ్వరు
నీశుఁ గాంచుఁడీ. 44

ఉ॥ జ్ఞాననిధుల్ ఋషుల్ మునులు
సర్వులు నా పరమాత్మతత్వ సం
ధాన మొనర్చి యాత్మలఁ దుదన్ మొదలుం
గనుపట్ట రన్నచోఁ

గాన్ఁగలారె బహ్మమును కామిను లీరలు ప్రేమలోలలై
మాని మమత్వ మూనుఁడు సమత్వము
గన్గొనుఁ డాత్మతత్వమున్. 45

మ॥ అల శ్రుత్యంతము బ్రహ్మతత్వము
సుపన్యాసం జ్ఞానర్పన్ ప్రజాం
గన లయ్యోదవుఁ డాడు నిర్గుణ నిరాకారార్చనం బొల్ల కే
మును బీయూషరసాభిషి క్తముగు లేమొల్క్ల్ విమజ్వాలపా
లొప్పనరింపం బడినట్లు నేలపయిఁ జూపుల్
డించి వాపోవుచున్. 46

మ॥ వనజాక్షా ప్రౌన కిట్టు లంను రెదురై వాదింప మేమెంత నీ
కనఘా! యూహ కెరుంగరాక
మదిడాయన్ రాక సాజంబుగా
దను జ్యోతిర్మయుఁడైసదా భ్రుకుటిమధ్యస్థాయియైనిల్చు న
న్ననిరాకార పరాత్మతత్వ మెఱుఁగన్
శక్యంబె మాకోంట్లకున్. 47

తే॥ అబలలము యోగసాధన మరయుఁగలమె?
కంటఁ గనుపట్టు నోములపంట నంద
నందన ప్రేమతత్వ సంధానము విడి
కంటఁ గన, వీను విన, నోడ లంటరాక
నుడుల కంటక ప్రానుడికడల కంటు
రూపు రూపింపరాని నీరూప నిర్గు
ణాత్మక బ్రహ్మతత్వ మే మరయు మిట్టి
నేలవిడిచిన సాము మాకేల సామి! 48

ఆ॥ వె॥ కనుల విందొనర్చు కనుపంట హరి వీడి
యెడకు నుడికి నొడలి కెఱుకరాని
కొఱుకరానియట్టి కొయ్యదేవయ్యలఁ
దలఁపుమందు వేల వలపు మాలి. 49

ఆ॥ వె॥ కనులు నిండు రూపుకలవాని గనుపండు
వొనరుపఁగలవానిఁ గనఁగలేని
గనక, కలఁడొ లేడొ యనుమశంకఁ గలఁగాంచ
వలయు వాని నేల తలఁపవలయు. 50

క॥ లోగల్ నిర్గుణమతమున
లోగొందువె మమ్ము నీ పలుకులకు నీవే
లోఁ గన్నెఱుఁగవు వెలిగను
లోఁగన్నుల్ సొట్టవడెనొ లొట్టలు వడెనో. 51

క॥ నిన్నొకర తగవరిగా నిడి
యన్నెము పున్నెము నెఱుంగ కడుగుదు మన్నా?
మిన్నయొ ప్రేమము, నేమమె
మిన్నయొ, రెండింట నేది మేలొఁ జెపుమా. 52

క॥ ఇత్తడి పుత్తడు లెవొ స్థిర
చిత్తుఁడవై రెంటి నేర్చి చెపు మెద్దానన్
నెత్తలఁ ద్రెంచియుఁ బ్రియులకు
నిత్తురొ శంకింప కట్టిదే మిన్నయగున్. 53

తే॥ ఏడఁ దిరిగిన మదికిఁ గ్రటాడనంగఁ
జను సగుణరూపకాశ్రయంబును ద్యజించి

తము నిరాశ్రయమహాను చిత్తములు జూడ
రూపు జాడలు లేని నిర్గుణుని నమ్మ॥ 54

ఉ॥ పుట్టఁడు గిట్టఁ డెట్టితలపోతల కందఁడు రూపొకండు చూ
పట్టఁడు తల్లితండ్రి గనుపట్ట రవానికిఁ బ్రాణుడుల్లు చే
పట్టెడు యత్నమాత్రములఁ బట్టువడంజవఁడాయనిశ్చితుఁ
బట్టఁగరాని బ్రహ్మము నుపాసన జేసిన నేమిలాభమహా. 55

సీ॥ కరపదమ్ములు లేవు పరమాత్మకందు నె
క్కరణి రోటం గట్టఁగలిగె నంబఁ
రూపురేకలు లేక రూపించునందు వే
రూపున గోపెమ్మ ప్రోచి పెంచె
ముఖ రసనా హీనుఁ డఖిలాత్ముఁ డందు వే
వగఁ జిల్కపల్కులఁ బల్కనేర్చె
నింద్రియరహితుఁ డయ్యీశ్వరుండం డెటు
చిననాట వెన్న మ్రుచ్చిల్లి కుడిచె?

తే॥ నెట్టు కనవచ్చు లోఁగన్న లొట్టవడిన
వాని కీ గుట్టుమట్టు లేమైనఁగాని
కన్నుమూసిన విచ్చినఁ గానవచ్చు
వ్రజకిశోరంబె పరమద్వైతంబు మాకు. 56

తే॥ కనుదెఱచి మాయునెడల సాక్షాత్కరించి
మొల్ల వేళలఁ గన్నులఁ జల్లపరచు
నల్ల ప్రత్యక్షదైవమహా నల్లనయ్య
మురళినూదెడు మోహంపు మూర్తితోడ. 57

తే॥ బ్రమయ కారయ లోఁగంటఁ బడునఁట వెలి
గంటికానని వెలుగంట కన్నుబొమల
నడుమ నాతని నెలవంట నాశరహితుఁ
డంట జ్యోతిర్మయుండంట యంటఁడంట. 58

తే॥ అలమి వెలిగంట లోఁగంట నచ్చుకట్టి
యాత్మ నెలకొన్న మురళీధరాకృతి విడి
నందనందన ప్రేమసంధాన ముడిగి
గోడపై బొమ్మ లెవ్వాఁడు గొలుచుఁ జెపుము. 59

క॥ సగుణోపాసనఁ దగిలిన
వగు మా చిత్తములు నిర్గుణారాధనమున్
దగులమునఁ దగులుకొన వే
పగిదిని నీ వెంత బాధపడి బోధింపన్. 60

ఉ॥ పద్దుగ మాకు బుద్ధిఁగఱపం జనుదెంచిన పెద్దమానిసుల్
సుద్దియు బుద్ధిమాలి రిటుజోటులకంటెను దామెముందుపై
సుద్దులు పెక్కులాడుచును జోగపువిద్దెను బల్మి మాతలన్
రుద్దగఁజూతు రద్దిర నిరూపకతత్వము నూరిపోయుచున్. 61

గోపిక లుద్ధవుఁ డాడిన నిర్గుణోపాసనము నిరాకరించుట.

ఉ॥ వ్యాపకుఁడంచు బ్రహ్మమయుఁడంచు శ్రుతుల్ వచియించుఁగాక మే
మేపగిదిన్ భజింతు మెద కృష్ణుని గోపకిశోరభావమే
రేపకడన్ సఖుల్ గొలువఁ గ్రేపుల మేప వనోర్వికేగి మున్
మాపటవేళవచ్చు హరిమంజులమూర్తిని గాంచియేసుమీ!
పాపవిదూర! మేము మనువారము చల్లగ నెల్లవారమున్.

మ॥ పరిపూర్ణుం డవినాశి విష్ణుఁడు పరబ్రహ్మంబు
బ్రాఁబల్కులన్
దరిఁ గన్గొని మహాప్రభావుఁడని యిందాకన్ వివాదింతు వె
వ్వరినిం గూర్చి, గ్రహింపలేక మగుడన్ బ్రశ్నింతు
మా కంస భూ
వరుఁ జక్కాడిన వాసుదేవుఁ డెవరో వాకొందువే
యుద్ధవా 63.

సీ॥ అక్రూరు వెనువెంట నరదాన మధురకు
బైనంబు గట్టిన బలియుఁ డెవఁడు
చాకి దారింగొట్టి కోకల నాకట్టి
తెలిమడుపులఁ గట్టె దిట్ట యెవఁడు
కంససభాస్థలింగల మేటివిలు ద్రుంచి
వెస నేన్గుఁ బీన్గు గావించె నెవఁడు
చాణూరు ముష్టికు నదమదం బొనరించి
కంసునుగ్గాడిన గండఁ డెవ్వ

ఆ॥ డనఘు నుగ్రసేను నా దేవకీవసు
దేవులఁ జెఱ వాపు ధీరుఁ డెవఁడు
మధుర నెలవు మరగి మంద మఱచె నెవం
డాతఁ డీవు పొగడునాతఁ డగునె? 64

తే॥ భమర! నీవిటు రేపాడి పాడి పాడి
నోట రాపాడె దెవ్వనిపాట చెపుమ
మాతులుని జంపి పేరు ప్రఖ్యాతిఁ గన్న
మేటి మగవాని కీరితిపాట యేమొ? 65

క. నీ కల్లబొల్లి పాటలు
మాకెల్ల నెఱుంగరావు మఱియొకమాటే
మూకొన వాకొనవే నీ
వే కదుపులనుండి వత్తు వెంతువెవానికా. 66

క॥ అఱుత వనమాల మోమున
మురళియు మాయూరబర్హముకుటము తలపై
వరలఁ గనువిందుగాఁ బురిఁ
గెరలుచుఁ దిరుగాడునొకొ కృష్ణుం డెపుడేఁ. 67

ద్విరదగతి:-

గోకులావాసులము గోపాలదాసులము
మా కులము గోకులము మన్నించు వ్రజకులము
ఆ యశోదాసుతోపాసనాలోలలము
తీయమున హరి సజాతీయులము సకియులము
గోబృందసహచారి గోవర్ధనోద్ధారి
మా బాలకృష్ణుఁడే మా మానసవిహారి
కృష్ణసహవాసినుల మేమెల్లవారలము
కృష్ణునే యెడ్గడగ నెద నమ్మువారలము
నందుఁడే మారాజు నందపత్నియె రాణి
విందాను విహరింప బృందావనక్షోణి
మా యమునవాఁకయే మాకు రత్నాకరము
మా యాలపట్టె సంపదకెల్ల నాకరము

అష్టసిద్ధులు లెంకలై కొల్చెనోయన్న !
యిష్టదైవము ప్రాణహితుఁడు హరి మా కెన్న. 68

ఆబాలగోపాల మందఱము మా మంద
నా బాలగోపాలకారాధకుల మంద
మందులే వినరు మామంద నీ బోధనము
మందు కేఁ గొనరు నేమము యోగసాధనము
నీవు గఱపెడు యోగనిష్ఠ లూనెడువారు
కైవల్యకాము లా కాశీపురిఁ గలారు
కొందు రీకొందు రూకొందు రీయోగమ్ము
నంద చని బోధింపు మనఘ! నీ యోగమ్ము
నందనందనుఁ డెడఁద నగరుమక్కువఁ జేసి
మందప ట్టెడఁబాసి మ మ్మనాథలఁ జేసి
తను మఱచి యోగసాధనము నవలంబింపఁ
బనిచె నేయపరాధఫలమో యనుభవింప
తా నెంత మఱచినను దత్పదధ్యానమ్ము
మానఁబో వనయమ్ము మా మనమ్ములు నమ్ము
కసిపట్టి రాహువటు గళపట్టు పట్టినను
విసివి సాజపుఁజలువ విడని నెల మచ్చునను
ప్రేమసముపాసినులు కృష్ణునెడసిన వీరు
శ్యామసుందరు మఱువఁజాలువా రేటీరు ?
ధనరాశి మా ప్రాణధనరాశి హరిఁ బాసి
పెనుము త్తి నాసింపఁ బేలలమె యెవ్వాసి. 69

క॥ గ్రంథగతజ్ఞానము నను
సంధించుచు గనులు మూసి సంయమధనుఁడై
బంధము విడి బ్రహ్మము నను
సంధించి తరించుఁగాక సాధకుఁ డాత్మన్. 70

తే॥ అట్టి యోగసమాధి నిష్ఠాత్మకంబె
కృష్ణు బ్రాణప్రియునిఁగూడి రేవగళ్లు
జుట్టుముట్టుక జతవట్టి చెట్టఁబట్టి
కంటఁ గాంచుచు నోడలంటి కఱవుదీఱ. 71

తే॥ ప్రియముఖాలోకసుఖసుధాబ్ధిని సతమ్ము
మునిఁగి తేలుచు బొద్దులుబుచ్చు ప్రేమ
సిద్ధలౌ ప్రేయసులె ధన్యజీవన లిల
నూర సుందరుఁ జూపులఁ జూరకొన్న
నీరసమ్ముగఁ దోఁచు సంసారమెల్ల. 72

క॥ ప్రాణమ్ము లోంట నుండఁగ
ప్రాణప్రియు మఱచి యోగభర మెటు కొననౌ
ప్రాణములతోడ నబ్బని
ప్రాణాంతకయోగ మూని పడయునదేమో. 73

తే. శ్యామసుందరు ప్రేమరసామృతమ్ముఁ
జవిమరగువారి కీ యోగసాధనములు
రుచి గొలుప వింత నేయి పాల్ గ్రోలు నోటి
కల్ల పులిచల్ల కడు వెగటైన పగిది. 74

తే. అరయుఁ డమ్మరో! దొడ్డబేహారి యొకఁడు
నిర్గుణజ్ఞానయోగ సన్నియమభరము

తెచ్చి మన మందలో దింపి తిష్ఠవేసి
తలకు బరువెక్కు నా పాడు నిలువసరకు. 75

తే॥ మనలఁ బెను వెఱ్ఱిగొల్లలమని తలంచి
రుద్దఁజూచెను మన తలఁ ద్రోసి యతఁడు
గుంజుఁ గొని గింజ రూకఁ గైకొనుచు నూక
మారకం బిచ్చుచున్న మన హరిపద
తోయజప్రేమ నాఱపించి మాయదారి
కటికి జడదారిమత మంటఁగట్టఁ జూచె
మాధవప్రేమమాధురి మరగు మనము
నీరసజ్ఞానయోగంబు నేర్వఁగలమె. 76

తే॥ మాధవప్రేమమాధురి మారక మిడి
నీ నిరాకార నిర్గుణ నీరస మత
మేరు గైకొంద్రు జోగపు బేరగాఁడ!
చాలు నీ జోగపుంజోలి చంకఁ బెట్టి
తడయ కేగుము వచ్చినదారిఁబట్టి. 77

క. వచ్చి మది నీదు బోధపు
టుచ్చునఁ బడువారె వార లుద్ధవ! చనుమీ
వచ్చినదారిని, హరిఁ దో
డ్తెచ్చిన నిచ్చెదము బహుమతిన్ మనసారన్. 78

క॥ మా పల్లెను నీ యోగ
వ్యాపారపుఁగీలు సనదు బైరాగిమతం
బేపగిదిని కృష్ణప్రే
మోపాసిను లియ్యకొందు రుపదేశములన్. 79

తే॥ కృష్ణపాదానురాగరక్తిమఁ దదన్య
యోగసాధనబోధ మింపొదవ దెదల
జోగపుఁ జేరి నీ మాయజోగిచేర
మొుకఁడు కొనఁ డెద నీకొనఁ డూకొనఁడును. 80

క॥ నిష్కామయోగభర మా
విష్కారమొనర్తు తెచ్చి వ్రేతల కీవే
నిష్కాముఁడవయి మగుడుము
నిష్కృతి నీ యోగభరము నెత్తలఁ గొనుచున్ 81

తే॥ మా తలల నంటఁగట్ట నీ వ్రేతలమున
గంప దింపితి జోగంపు గంపసరకు
చేర విది యింపొనర్పదో చేరగాఁడ!
అలఁతి కూరాకునకు ముత్తెములను మార్చు
పగిది, గారుప్పునీళ్లకై పాల విడిన
చందమున, ద్రాక్ష విడి వేముఁ జవిఁగొనినటు
నిర్గుణజ్ఞానయోగంపు నీరసంపు
సర కెవరు గొంద్రు ప్రేమమాధురిని దొరఁగి. 82

క॥ పరమార్థసార్థవాహుం
డరుదెంచి సుకారియెడ్లయటు మోచుక త్రాఁ
బరమపురాణభరంబును
బురి దింపెను యోగవిద్యఁ బూన్పఁగ బలిమిన్. 83

తే॥ ఇరుకటారులు నొకయొర నిరుకటమయి
యిముడని విధాన హరి ప్రేమమిరవుకొనిన

మాయమనమ్ముల యోగసమాధులకును
జోటులేదయ్య చిన్నికృష్ణునకుఁదక్క. 84

శా॥ నిండున్ మాతులు మేము పంపుకొను
సందేశంబులన్ నేటి కె
వ్వండున్ గ్రమ్మఱఁ దందునుండి యొకఁ
డవ్వార్తాహరుల్ దారినే
గండాలం బడి చచ్చిరో, మగుడరాకన్
మాన్ప మాయావి కృ
ష్ణుండే వారల దారిఁ ద్రిప్పి భ్రమలన్
ద్రొక్కించి రానీయఁడో. 85.

క॥ అంపడు తన సందేశము
నంపిన దా మగుడ నంపఁ డవ్వారల నే
మంపిన లేఖలు వ్రాయఁగ
సంపూర్ణంబయ్యె నింట శ్యామిక యెల్లన్. 86

*క॥ ఇంట సిరానిండుకొనెం
గంటను గన్నీరునిండె గాటుక కన్నీ
రంటుకొని తడిసి పత్రము
కంటంబడె శ్యామమయముగా మదివోలెన్. 87

ఉ॥ వచ్చుచుఁ బోవునట్టి కనవచ్చిన పాంథులతోడ వార్తలన్
బుచ్చితి మెన్నొ, తన్ను దలపోసి లిఖింపఁగఁ గంటికడ్డమై
వచ్చిన యశ్రుసలం దడియు పత్రము,తద్విరహాగ్ని తమ్ములన్

జిచ్చునమాడ్చి,గన్గవయు జింతను మాతవడక్ లిఖింప మే
మచ్చున,ధ్యానయోగమున మాగతి యీగతి నుండ
నుండ నుద్ధవా. 88

ఉ॥ అద్దిర! మమ్ముఁబోంట్ల జవరాండ్రకు నిర్గుణపార మాదలన్
రుద్దఁగఁ జూతు విట్టి యపురూపపు జప్పిడివిద్దె నేర్పఁగాఁ
బెద్దగ ముద్దరాండ్రె కనుపించిరె! యుద్ధవ! నీదు బుద్ధి కే
సుద్దులు మాకెవారి కెద సాక్షివవచ్చినదారిఁ బట్టుమా.

ద్విరదగతి రగడ:-

నందనందనుఁ డంపినాఁడే మొ యనుకొందు
నెందుండి యేతెంతువే తుమ్మెదా! యిందు
అల్ల కృష్ణునివోలె నగపడుదు వీ క్రేవ
నల్లనయి వచ్చినా నడికట్టుబడి లేవ
మున్న మా సర్వస్వమును వెంటఁగొని చనెను
వెన్నుఁ డింకేది తే వ్రేపల్లె కంపె నిను
మాకున్న మనసొకటి మధుర తోకొనిపోయి
చీకుఁ జింతయు లేక చెలఁగుచుండెను హాయి
కలరు నగలాండ్రచట పెక్కండ్రు మధురయందు
వలచి వలపించుకొనువారె యందరు నందు
నిను మెచ్చుకొను మేటి నెరజాణ లుండ్రందు
చను మటకు నిటకు రా జాణతన మేమందు
పల్లె పడఁచులకున్నె వచ్చి తేటికి మనసు
బల్లవింపఁగఁ జేయు వారి విడ నేసొగసు

నల్లవారల యెల్ల నైజములు కనవచ్చు
నల్లవా రెందున్న నైజంబు లోకమచ్చు
కనవచ్చు నీ మెచ్చుఁ గని మెచ్చు నాగరాం
గనలనేస్తము వీడి కదలిరా బాగురా! 90

కన్నుఁగవ గని జన్మ సాఫల్యమందెనా
చిన్నారికృష్ణయ్య రూపూ - యోగంపుఁ
దెన్న నలవఱచి యారూపూ - మా తలఁపు
దెన్ననుండి మఱల్చి వెన్న మఱపింప మా
కెన్నొ యుపదేశముల మిన్నంటఁ గఱపెదవు
మా యోగమూలించి మాధవుని మఱువుఁడని
వేయేల సెప్పంగజాలూ - శ్రీలోలుఁ
డే యెఱుఁగు మా తలపుఁజాలూ - సర్వాత్ముఁ
డా యనఘ గుణరత్న తోయనిధి కృష్ణనిధిఁ
బాయ మణిగొని దుమ్ము వోయుదువె మానోట
నట్టడవి నెండ వానల కోర్చి మునులూను
నట్టి యోగసునిష్ఠ లేడా! స్వామి మా
యట్టికోమలు లూనులేడా! వ్రజ మి
ట్టట్టె చూర్ణంబవునె! బిట్టువిసి నుసియానె
వట్టిచేతులతోడఁ బట్టి పగులంగొట్ట
నీ తత్వమున సనదు మాతృష్ణ కృష్ణ సం
ప్రీతి సుధగా కెన్నియేళ్ళలా-సెలయేళ్ళ
శీతలస్వాదులవు నీళ్ళలా - నిండార
స్రోతసులబాఱినను స్వాతిచినికిన చినుకె
చాతకము దగ దీర్చురీతి దగ బ్రీతితో. 91

క॥ మత్తమధువ్రత! నీ యీ
జిత్తులు గనవచ్చె సత్తు చిత్తని యేవో
మెత్తనిమాటలతో మా
చిత్తము మఱపించు కృష్ణచింతన ముడుగన్. 92

ఉ॥ తిన్నగఁ బల్కుమా పలుకు తెన్నెఱుంగవు లోనికన్నపై
గన్నను లొట్టవోవ నెటు కన్గొననేర్తువు సారసూక్తి మా
కన్నను బుద్ధిమాలి, మముఁ గాననివారని యుద్ధరింప నే
తెన్నున వచ్చితయ్య! మముఁ దేర్పఁగఁ దీర్పఁగ
బ్రహ్మవిద్యలన్. 93

ఉ॥ ప్రేమమె ప్రేమమూలమగు, విశ్వ మిదెల్లను
ప్రేమబద్ధమౌఁ
బ్రేమమె మోక్షసాధకము, ప్రేమమె జీవనముక్తి
హేతువౌ
ప్రేమమె సార్థకత్వమొదవించును ప్రేమమె తారకంబు మా
ప్రేమమె నిక్క మానెడ లభించెడు నందసుతుం డవశ్యమున్.

ద్విరదగతి రగడ:-

అనుచుఁ బ్రేమోన్మత్తలై మత్తకాశినులు
వినుచు నా ప్రేమ ప్రవృత్త్యుపన్యాసములు
విని వార లలవరచు ప్రేమ యోగముఁ గఱచి
వినుపఁ బోయిన యోగవృత్తాంతమును మఱచి
హరిసఖుం డుద్ధవుఁడు హరిపదాంబుజభక్తి
పరసఖ్యభావ సంభావితుండై భక్తి

ఆడెఁ బాడెను దాండవంబాడె జెరలాడె
జేడియలఁ గొనియాడె స్నేహతత్వముఁ బాడె
సకలంబు లోమఱచి సకుల నభివందించె
నికట కుటనికురమ్ము నెమ్మనిఁ గవుఁగిలించె.
ధన్యలున్ ధన్యమూర్ధన్య లీగోపికలు
మాన్యముల్ లోకసమ్మాన్య విరా గోకులము
ధన్యమా నందనందనుఁ డాల మేపఁజను
వన్యభువి తత్పదస్పర్శ భాగ్యమ్మునను
బుద్ధిసెప్పఁగవచ్చు బోద్ధకే కనువిప్పు
బుద్ధిసెప్పిరి ప్రేమమూర్తులగు వీ రొప్పు
యోగపదేష్ట నాకేగల్గెఁ బ్రేమ యిటు
యోగోపదేశ మీ యుగ్మలుల కింక నెటు
అని వారి మెచ్చి గోపాకల్పము ధరించి
కనవచ్చెఁ గృష్ణవిభు కట్టెదుట కరుదెంచి
యదువీర ! యదునాథ ! యను తొంటి సంబుద్ధి
మది మఱచి గోపభామలపైగల సుబుద్ధి
గోపగోపీలోల ! గోపాలనాలోల !
గోపాలకస్వామి ! గోవింద ! యని చాల
కూర్మిజాల్వారు కొంగ్రొత్త పిలుపులఁ బిలచి
యర్మిలిసకుం డతం డనె నిట్టు హారిఁ దలఁచి
వ్రేతలము వేంచేసి వ్రేతలను గని రమ్ము
నీతలఁపువలపులఁ బునీతలై రనయమ్ము

నందగోకుల మహానందసుఖములు డింద
నిందంద తిరుగ నీ కెట్లొప్పిన దెడంద

డెందమున నిన్ దలఁచి డింది కుందెడు గోప
సుందరులకెల్ల నినుఁ జూపిర మ్మొక తేప

వ్రేత లూనిన నీదు ప్రేమవ్రతముఁ గన్న
నే తపోయోగంబు లెదకెక్క వోయన్న !

అని కృష్ణవిభు నెంచి సాక్షాత్పరేశునిగ
మొనసి సాగిలి మ్రొక్కె మోదాశ్రు లలమగా

నుడులు తడబాటుతో నుడియాడకున్న నా
వడువుఁ గని ప్రేమవిహ్వలు డౌచుఁ గన్నులన్

నీరిడుచు మాధవుఁడు నేలపైఁ గూలఁబడి
నీరొత్తుకొని పసిఁడినిగవలువ కొంగునిడి

"తరుణులకు యోగవిద్యలఁ గఱపి వచ్చితివె
పరమసఖ!యని యడిగె వ్యంగ్యమున నాప్రభువె.



శ్రీ గోదాగ్రంథమాలకు విరాళము లొసగిన యీ యుదారులకు మా స్వామి సకలాభీష్టము లొసగుగాక !

### గ్రంథ ముద్రాపకులు :

1. శ్రీమతి కొండూరి తిరుమల ఆండాళమ్మగారు 250-00
2. శ్రీమతి కొండూరి లక్ష్మీనరసమ్మగారు 300-00

### శాశ్వత పోషకులు :

1. శ్రీ కోట సుందరరామశర్మగారు, ఢిల్లీ 116-00

### సభ్యులు :

1. శ్రీమాన్ శ్రీనివాసాచార్యులుగారు, స్టేట్ బ్యాంక్, గుడివాడ 10-00
2. శ్రీ దోనేపూడి సీతారామయ్యగారు, ఘంటసాల 10-00
3. శ్రీమాన్ పంచాంగ వెంకట రంగాచార్యులుగారు, శ్రీమన్నారాయణపురము 10-00

### అభిమానులు :

1. శ్రీ వల్లూరి వెంకట సూర్యనారాయణగారు, వకీలు బందరు 6-00
2. శ్రీ కాకాని కోటయ్యగారు, ఘంటసాల 5-00
3. శ్రీ కొల్లూరి శ్రీరంగనాయకులుగారు ఘంటసాలపాలెము 5-00
4. శ్రీ తుమ్మల గోపాలకృష్ణయ్యగారు, ఘంటసాలపాలెము 5-00
5. శ్రీ కంతేటి రామమోహనరావుగారు, బందరు 5-00
6. శ్రీ మావులేటి సోమరాజుగారు, గుండుగొలను 5-00
7. శ్రీ డాక్టరు మండలి సీతారామయ్యగారు, కోడూరు 5-00
8. శ్రీ తుమ్మల కుటుంబరావుగారు, కొత్తపల్లి 5-00
9. శ్రీ మావులేటి సోమయాజిగారు, గుండుగొలను 5-00
10. శ్రీ రామకృష్ణా రైసుమిల్లు, మంగళగిరి 5-00
11. శ్రీ దేశభట్ల రంగయ్యగారు, ఆంధ్రసంఘము, ఢిల్లీ 5-00
12. శ్రీ మైలవరపు రామమూర్తిగారు, కృష్ణంపాలెము 5-00
13. శ్రీ సాలస కృష్ణశాస్త్రిగారు, బందరు 5-00
14. శ్రీ డాక్టరు ఎమ్. నాగేశ్వరరావుగారు, బందరు 5-00
15. శ్రీ సిద్ధినేని వెంకట్రామయ్యగారు, ఉల్లిపాలెము 5-00
16. శ్రీ గళ్ళా రాఘవయ్యగారు, ఉల్లిపాలెము 5-00
17. శ్రీమతి కొండూరి రంగనాయకమ్మగారు, శ్రీమన్నారాయణపురము 5-00
18. శ్రీ పరుచూరి రాఘవయ్యగారు. ఉల్లిపాలెము 5-00
19. శ్రీ దామెర్ల రామచంద్రుడుగారు, కోడూరు 5-00
20. శ్రీ మెండు గోపాలస్వామిగారు, కోడూరు 5-00
21. శ్రీమాన్ యస్. టి. పి. రంగాచార్యులుగారు, పిప్పర 5-00

# శ్రీ గోదా గ్రంథమాల

## సభ్యత్వ వివరము:

1. గ్రంథ ముద్రాపకులు:

గ్రంథవ్యయము సర్వము భరించువారు

2. శాశ్వత పోషకులు:

ఒకేసారి రు 116-0-0 విరాళము నిచ్చువారు

3. పోషకులు:

ప్రతి వత్సరము రు 25-0-0 ఇచ్చువారు



4. సభ్యులు:

ప్రతి వత్సరము రు 10-0-0 ఇచ్చువారు

5. అభిమానులు:

ప్రతి వత్సరము రు 5-0-0 ఇచ్చువారు

సూచన:—దాతలపేర్లు కృతజ్ఞతా పూర్వకముగ గ్రంథమున ముద్రింపబడును.

## ప్రశంసలు : ప్రముఖులు



1. చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు, ఢిల్లీ.

"అంజలి, దేవతాస్తుతిసుమాంజలి, భక్తిరసామృతైక ధా
రాంజలి, విష్ణుచిత్త తనయాస్తుతిరత్న విభాసితోరు భ
క్త్యంజలి, మిశ్రసత్కవికృతాంచిత సంచిత పద్యపంక్తి ము
క్తాంజలి చూచి భక్తిమెయి నంజలి చేసితి సంతసిల్లుచున్."

2. శ్రీ భమిడిపాటి వేంకట సుబ్రహ్మణ్య శర్మగారు,
మోపిదేవి.

"పలుకులఁ దేనెలొల్కఁ బ్రతిభాభరితంబగు శయ్యతో సుధీం
ద్రులు వినుతింప మాధురి నతుల్యత నొప్పిన యీ త్రివేణి సే
నలఘుతరాదరంబున ప్రహర్ష మెసంగఁబఠించి ధన్యతం
జెలఁగి మిముం గవిత్రయము జెంది కృతజ్ఞత సంస్మరించెదన్."

3. శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు,
విజయవాడ.

"ఆస్వాదాదుల కొలంబైన మీ మ
హోద్యమంబున మధురతరోక్తి అలరు
మీరయొక ప్రభవతారయై మెరయుగాత
మమలతరచర్య! శ్రీ నృసింహార్యవర్య!"

4. శ్రీ ధనకుధరం వరదాచార్యులుగారు,
రామానుజ కీర్తి కౌముది ఆలపాడు.

"భరతోర్వీస్థలి విష్ణుభక్తియను సౌభాగ్యంబు పండింపగా
బరమార్థంబును పొంచుచుంటి రిల నిస్స్వార్థంబుతో కె. టి. యల్.
నరసింహార్య! మహోపకార మిది మీ నైపుణ్యముం జూపుచున్
చిరకాలం బిటు లీ సదుద్యమమునున్ చేపట్టి సాగింపుడీ!

---

శ్రీ గోదా గ్రంథమాల ప్రథమపుష్పము : 'అంజలి'
ప్రతులు లేవు.

ద్వితీయ పుష్పము : 'త్రివేణి'

1 శఠకోప చరిత్ర శ్రీ న. చ. కృష్ణమాచార్యులు

2 పరాంకుశ శతకము శ్రీ తి. న. చ. సంజ తిరువేంకటాచార్యులు

3 శఠకోప గీతామృతము శ్రీ డాక్టరు న. చ. రాఘవాచార్యులు

బాలసాహితీ ప్రచురణలు – ప్రథమ రత్నము :

మీరాబాయి : (చరిత్ర) వెల 50 నయాపైసలు

కర్త : హిందీ విద్వాన్ శ్రీ మిక్కిలినేని సుబ్బారావు

రాబోవు గ్రంథములు :

1 నారాయణ శతకము "సంగీత సాహిత్య కళానిధి" శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

2 శ్రీ రామానుజ చరిత్ర శ్రీ క. టి. యల్. నరసింహాచార్యులు సాహిత్యరత్న, భాషాప్రవీణ.

ప్రతులకు :

కాండూరి లక్ష్మీనరసమ్మ

వ్యవస్థాపకురాలు :

శ్రీ గోదా గ్రంథమాల

శ్రీ మన్నారాయణపురము

ఉల్లిపాలెం పోష్టు, దివితాలూకా, కృష్ణాజిల్లా.

త్రివేణి వెల : 2-0-0